కం. జనకునకును దశరథునకును
మునులకునుఁ వందనములు పొనరించియు దీ
వనలను దంపతులందఱు
గొని రానందంబు వెలిగొనఁగా మదులన్. 133

వ. అంత విందులారగించి జనకుండిచ్చిన సమ్మానంబులందికొని కౌశికునియొద్ద సెలవుగైకొని దశరథుండు దారపుత్త్రస్నుషాయుతుఁడై సాకేతంబునకుంజనియెను. జనకుండును హర్షంబున మిథిల కేగెను. విశ్వామిత్త్రుండును స్వకార్యంబవిఘ్నంబుగా సమకూరినందులకు సంతసించి సుఖంబుండె. 134

గీ. రాక్షసులు గాంచుచుండి సర్వంబుదీని
నూయలిఁకనచ్చిరావని మానికొనుచు
వ్యసనమొందుచు లంకకునరిగి; రనుచుఁ
దొడరి వాల్మీకితో నారదుండువలికె. 135

శా. ప్రాచీనార్యకళాలతా తరువనీపాలావతంసోత్తమా!
శౌచౌదార్యముఖప్రసిద్ధగుణవృక్షశ్రీవసంతోదయా!
రోచిష్ణుస్వపురాంబరాంతరతటీప్రోల్లాసిజైవాతృకా!
నీచీభూతసమస్తశాత్రవతతీ! నిత్యప్రసిద్ధోన్నతీ! 136

గీ. విమలమాద్గల్యగోత్రపవిత్రమూర్తి!
సరస సంగీత సాహిత్య శాస్త్రరసిక!
వదన నృత్యన్మహారాజ భాగ్యకళిక!
ప్రియకరాభిఖ్య! శంకరరెడ్డిముఖ్య! 137